# సుగుణ శతకము

## (సటీక)

గ్రంథకర్త

## పట్టిసపు శ్రీరామమూర్తి



పబ్లిషర్సు

శ్రీ శక్తి అండ్ కో

ఎథ్రి ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

చోడవరం

(విశాఖపట్టణముజిల్లా)

1933

[కాపీరైటు] [వెల 0-2-6

మదరాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే పాఠ్యగ్రంథముగా ఆమోదింపబడినది
ఫో. సెం. జా. గె. 9-4-29.

శ్రీరామాంధ్ర గ్రంథాలయానుబంధ ప్రథమ

గ్రంథము

# సుగుణశతకము

## (సటీక)

శ్రీరామాంధ్ర గ్రంథాలయ వ్యవస్థాపకులును
కవితా సమితి సభ్యులును, శ్రీరామ
హిందూ ప్రాథమిక విద్యాలయ
సంస్థాపకులు నగు

బ్రహ్మశ్రీ

పట్టిసపు శ్రీరామమూర్తి గారిచే

రచియింపఁబడినది.

రెండవకూర్పు 1000 ప్రతులు.

రామచంద్రపురం
రెడ్డీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1933

 [వెల 0—2—6

# అభిప్రాయములు.



బ్రహ్మశ్రీ పండిత మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

కలాభిలాషక కావ్యమాలా సంపాదకులు.

కవితాసమిత్యధ్యక్షులు (విశాఖపట్టణం)

"మా కవితాసమితిసభ్యులలో నొకరగు శ్రీయుత పట్టెపప్రు శ్రీరామమూర్తిగారు వ్రాసిన సుగుణశతకము నా యభిప్రాయముకొఱకు పంపగా చదివి చూచితిని. ఇది సుమతీశతకము ననుకరించి వ్రాసినట్టుల కానవచ్చును. సుమతీశతకము చాలకాలమునుండి తెలుగు విద్యార్థులకు పాఠ్యపుస్తకముగా నుండి నేఁటికిఁ గఱపుచున్నను దానియందు పిల్లలచే చదివించి బోధించుటకు వీలుకాని పద్యములు కొన్ని కలవు. సుగుణశతకములోని పద్యము లన్నియును పిల్లలచే చదివించి వారికి బోధపఱచుటకు తగినవిగా కానవచ్చును. దీని శైలి సులభము కావున, ఇది ప్రాథమిక పాఠశాలలలో సుమతీశతకమువలె వాడదగును. కృతికర్తగారు ఇటులే ఆంధ్రలోకమున కుపకరించు పలుకృతులు వ్రాసి దేశసేవ చేయు శక్తి పరాత్పరుఁ డొసంగుఁగాక!"

ది [illegible]
విశాఖపట్టణం.



మారేపల్లి రామచంద్రశాస్త్రి.



మ॥ రా॥ రా॥ శ్రీ॥ తెన్నేటి విశ్వనాథంపంతులుగారు,
ఎమ్. ఎ బి. యల్. హైకోర్టువకీలు (విశాఖపట్టణం)

**సుగుణశతకము:—**

ఈచిన్నగ్రంథముయొక్క వ్రాతప్రతిని గ్రంథకర్తగారి దయవల్ల చూచితిని; పద్యము లన్నియు నిరాడంబరముగను సుహృదయమైన భావముతోను వ్రాయబడినవి. బాలురగు చదువరుల మనసుయొక్క లేవడితనమునకు తగినట్లుగ సరళమైన నీతులను సరళమైన శైలిలో వ్రాసియున్నారు. గ్రంథకర్తగారియొక్క కవితాశక్తి నానాను ఇంకను రసపోషణమై వర్ధిల్లునుగాక!

12—1—1928 తెన్నేటి విశ్వనాథం.

శ్రీయుత పుప్పుండా అప్పలస్వామిగారు
కవితాసమితి కార్యదర్శి (విశాఖపట్టణం).

నామిత్రులగు శ్రీయుత పట్టినపు శ్రీరామమూర్తి గారి సుగుణశతకమును చదివితిని. ఇదియొక చక్కని నీతిశతకము. సాధారణముగా ప్రచారమున గల పెక్కునీతులను గ్రంథకర్త క్రోడీకరించి వ్రాయుట ప్రశంసనీయము. ఇందలి పెక్కునీతులు బాలుర నుద్దేశించి వ్రాసిరనుట స్పష్టము. బాలురకొరకు నుద్దేశించి దీర్ఘసమాసములతో కఠినపదజా

ముతో వారికి నాశ్చర్యముగునటులఁగాక, వీరు సులభముగు తేలికగల శైలిని రచించిరి. ఇందు పద్యబంధమును నడకకుంటక ధారాళముగ సాగిపోవుచున్నది. ఇందలి నీతు లరయునపుడు కవికిఁ గల లోకజ్ఞానము తెలియఁగలదు. శ్రీ రామమూర్తి గారి యీశతకము ఆంధ్రోదయాల మన్ననలఁ బడయుఁగాక!

20—1—28 పురిపండా అప్పలస్వామి

---

మ॥ రా॥ శ్రీ॥ బి. రామమూర్తి పంతులుగారు,
బి. ఎ. ఎల్. టి. డిప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు,
చోడవరం రేంజి.

గ్రంథకర్త ఈ సుగుణశతకమును నాకు చదివి వినిపించెను. శైలి సులభముగా నున్నది. సాధారణముగా వాడుకలోఁగల పెక్కునీతు లిందుఁగలవు. సుమతీశతకము మొదలగు నీతిబోధకశతకములందు బాలురకు బోధింపనలవికాని పద్యములు పెక్కులున్నవి; కాని యీశతకమున నట్టిలోపములు కానరావు. గనుకను బాగుండుటచే బాలురకు ఆహ్లాదకరముగా నుండునని చెప్పుట నిస్సందేహము. ఎలిమెంటరీ పాఠశాలలయందు మొదటి మూడుతరగతులలోను పాఠ్యగ్రంథముగా నుంచుటకు చాలా తగియున్నది.

చోడవరం రేంజి.
విశాఖపట్టణం జిల్లా
21—1—28

బి. రామమూర్తి B. A. L. T
డిప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు.

"సుగుణశతకము. — ఈ శతకము పిఠాపురవాస్తవ్యులును కవితాసమితి సభ్యులును నగు పట్టిసపు శ్రీరామమూర్తిగారిచే రచియింపబడినది ఈశతకము మదరాసు టెక్స్టుబుక్ కమిటీ వారిచే పాఠశాలలందుపయోగార్హముగు గ్రంథముగా నామోదింపబడినది. బాలురకు సుబోధకముగు శైలితో, హాంశముల విభాగముతో నలరారుచున్నది.

"ప్రారంభవిద్య" పత్రిక

"ఈ చిన్నపుస్తకము చిన్నపిల్లలకు మహోపకారము చేయు ననుటకు సందేహము లేదు.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక."

దానవవధ మణిమాలాది నాటకగ్రంథకర్తలగు శ్రీయుత ఉమర్ అలీషాకవిగారు పిఠాపురం.

"సుగుణశతకంబు నిజముగా ♦ సుగుణమణుల
రాసిగా నింద యనియొడిఁ ♦ బోసినట్లు
పృథుసుధామధురోక్తుల ♦ వెలయుచుండె
ప్రథితకీర్తి! పట్టిసపు శ్రీ ♦ రామమూర్తి!"

# సుగుణశతకము.

త్రిదశ = దేవతలయొక్క. ఆళి = సమూహముచేత, గేయున్ = పొగడబడువానిని, ఎసఁగున్ = ఒప్పును. మహి = భూమి

## —: తల్లి :—

క. తొమ్మిదినెలలును దనగ
ర్భమ్మున నిడి మోసి కనియుఁ ♦ బాలిడి సంతో
షమ్మునఁ బెంచిన తల్లికి
ముమ్మారులు ప్రతిదినమ్ము ♦ మ్రొక్కుము; సుగుణా! ౨

ముమ్మారులు = మూఁడుసారులు (ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము).

క. తనసతిని గన్నతల్లియు
తనయన్న సతీలలామ ♦ ధరపతిసతియున్
తన గురు నిల్లాలును నిజ
జననికి సమమవారనుట ♦ సత్యము సుగుణా! ౩

అన్న సతీలలామ = అన్నభార్య, ధరపతిసతి = రాజుభార్య, గురునిల్లాలు = గురుభార్య, నిజ = తనయొక్క, జననికి = తల్లికి.

## —: తండ్రి :—

క. దుస్తులనిచ్చియుఁ దినుబడి
వస్తువులను నిచ్చి విద్య ♦ వచ్చుట కెన్నో
పుస్తకములు గొనుజనకుని
హస్తమ్ములు మోడ్చి కొల్వ ♦ నగు జుమి సుగుణా! ౪

జనకుని = తండ్రిని. హస్తములు = చేతులు, మోడ్చి = జోడించి.

క. మనపుట్టువునకు హేతువు
మన తెలివికి కారణమ్ము ♦ మన జనకుఁడెపో;
కనుకఁ సాక్షాద్దేవుం
డని జనకుని గొల్వవలయు ♦ నందఱు సుగుణా!

జనకుఁడెపో = తండ్రియే సుమీ, సాక్షాత్ = ప్రత్యక్షముగ.

క. వరవిద్యావంతుఁడగు
గురువే దైవంబు నీకుఁ; ♦ గొలుచుచు వానిన్
నిరతము ప్రోవంగ నెప్పుడుఁ
బరమేశ్వరు వేఁడుచుండ ♦ వలయును సుగుణా!

వర = శ్రేష్ఠమైన, నిరతము = ఎల్లప్పుడు, ప్రోవంగన్ = కాపాడుటకు,

క. ఎప్పుడుఁ బాఠములెల్లను
జెప్పుచు జ్ఞానమ్ము గలుగఁ ♦ జేసిన గురువే
చొప్పునఁ జెప్పునొ తప్పక
యప్పగిదిన్ నడువవలయు ♦ నవనిన్ సుగుణా!

ఏచొప్పున = ఏరీతిగా, అప్పగిదిన = ఆరీతిగా, అవనిన్ = భూమియందు.

## —: ఆరోగ్యము :—

క. ప్రతిదినము స్నానమాడుచు
నుతికినబట్టలను గట్టు ♦ మొప్పుగ నెపుడు.

హితముగువస్తువు లైనను
మితముగ వేళకు భుజింప ♦ మేలగు సుగుణా!

హితము = ఇష్టము.

క. ఉడుకనివస్తువు తినకుము;
తడిబట్టను గట్టుకొనకు; ♦ తడిగలయింటన్
విడియకుము; జడిని దడియకు;
చెడుగాలిని పీల్వకెపుడుఁ; ♦ జెడెదవు సుగుణా!

విడియకుము = నివసింపకుము, జడి = వాన.

క. భాగ్యమె మిన్ననుకొనకుము;
భాగ్యమ్మును మించునట్టి ♦ భాగ్యము గల; దా
భాగ్యం బారోగ్యమహా
భాగ్యము; నీ వెపుడు దానిఁ ♦ బడయుము సుగుణా! ౧౧

మిన్న = హెచ్చు, భాగ్యము = ధనధాన్యాదుల సమృద్ధి, పడయుము = పొందుము.

—: స్నేహము :—

క. మనమేలు గోరునాతఁడె
మనచుట్టము; మనలఁ గాచు ♦ మనుజుఁడె జనకుం;
డనయము విశ్వాసము గల
మనుజుఁడె పో స్నేహితుండు ♦ మహిలో సుగుణా! ౧౨

జనకుండు=తండ్రి. అనయము=ఎల్లప్పుడు, విశ్వాసము=నమ్మిక.

క. చెడి చెల్లెలింటి కేగకు;
వడి నలుకం బోకు మత్త ♦ వారింటికి; నీ
కుడిభుజమని మది నమ్ముచుఁ
జెడుకాలము నాఁడు హితుని ♦ జేయుము సుగుణా! ౧౩

చెడి=ధనధాన్యాదులను పోగొట్టుకొని, హితుని=స్నేహితుని.

క. దొంగలస్నేహము సేయకు;
దొంగందురు నిన్నుఁగూడ; ♦ దొంగలనగలన్
పొంగుచు నెన్నఁడు గొనకుము;
వెంగలివై మోసపోకు ♦ వినుమా సుగుణా! ౧౪

వెంగలివై = తెలివిలేనివానివై.

క. చెడుసహవాసము వలనన్
జెడు నీసత్కీర్తి; యెల్ల ♦ శిష్టులు నిన్నున్
విడిచెదరు; కాన యెన్నఁడు
చెడువారలఁగూడి నీవు ♦ చెడకుము సుగుణా! ౧౫

సత్కీర్తి = మంచిపేరు, శిష్టులు = ఆజ్ఞకులోఁబడువారు.

—: బంధువులు :—

క. పచ్చిగలనాఁడె బంధువు
లెచ్చుదు; నొక్కరును గుమ్మ ♦ మెక్కరు లేమిన్;
పచ్చిక మొలచిన యప్పుడె
వచ్చును బీడులకు మేయఁ ♦ బసువులు సుగుణా! ౧౬

తేమిఁ = లేకపోవుటచేత, (ధనధాన్యాదులు లేకపోవుటచే)
బీడు = పశువులు మేత మేయు మైదానము.

క. బలముగలనాఁటి బంధువె
బల ముడిగినఁ బగతుఁడౌను, ♦ జ్వాలకుబలముం
గలిగినఁ దోడ్పడుగాలియె
బల ముడిగనయప్పు డార్పు ♦ బాగుగ సుగుణా! ౧౭

ఉడిగిన = తగ్గిన, పగతుఁడు = పగవాఁడు, జ్వాల = మంట

క. జనకుఁడు జ్ఞానమె; క్షమయే
తనయుఁడు; శాంతమ్మె సతియు; ♦ దయయే సఖుఁడున్
జననియు సత్యమె; ధర్మమె
యనుజుఁ; డిఁక లేరు వేరె ♦ యాప్తులు సుగుణా! ౧౮

క్షమ = ఓర్పు. శాంతము = ఓర్పుతోఁ గూడిన సామర్థ్యము.
ఆప్తులు = దగ్గరబంధువులు.

## —: మంచినడత :—

క. తప్పకుమీ నీమాటన్;
చెప్పకుమీ యిచ్చి మరలఁ; ♦ దిరిపం బీయన్
దిప్పకుమీ; చాడీలన్
జెప్పకుమీ; నీదుకీర్తి ♦ చెడుఁ జుమీ సుగుణా! ౧౯

తిరిపము=బిచ్చము, చాడీలు=కొండెములు

క. భాషింపకు దుష్టునితో;
ఘోషింపకు మెప్పుడు నింటి ♦ గుట్టుం బైనన్;

దూషింపకు బంధుల; న
న్వేషింపకు పరులదోష ♦ నిచయము; సుగుణా! ౧౦

గుణవనితా=గుణాన్వితా. ఘోషింపకు=చాటింపకు, దూషింపకు=తూలనాడకు. అన్వేషింపకు=వెదుకకు, పరుల=ఇతరులయొక్క, దోష=తప్పుల, నిచయము = సమూహము

కం. చెడుమాటలాడఁగూడదు;
చెడుతలఁపులఁ దలఁపరాదు; ♦ చెడుపొత్తములన్
విడువుము; వానిన్ జదివినఁ
జెడిపోవును నీమనస్సు ♦ సిద్ధము సుగుణా! ౧౧

తలఁపు = ఆలోచన,

కం. చేరకు మిల్లటికమునకుఁ;
గోరకు మితరులధనమ్ముఁ; ♦ గురువులతోడన్
బోరకు; మమాయకులఁ గని
కేరకు; మివి చెఱుచు నీకు ♦ కీర్తిన్; సుగుణా! ౧౨

ఇల్లటికము = అల్లుఁడు అత్తవారింట యుండుట.

కం. ఇష్టముతోఁ బనిఁ జేసినఁ
గష్టమునకుఁ దగినసొమ్ము ♦ గల్గును గనుకన్
గష్టపడి పనిని జేయుము;
'కష్టేఫలి' యనరె యీజ ♦ గమ్మున సుగుణా! ౧౩

కష్టేఫలి = కష్టపడిన ఫలితము గలుగును. జగమున = ప్రపంచమున

కం. పరకాంతలఁ దల్లులవలెఁ,
బరధనమును మంటిపెల్ల ♦ పగిదిగ మనమునం

దరసి కనువాని సుగుణా
కరుఁ డందురు; మంచిపేరు ♦ గలుగును సుగుణా! ౨౭

పగిది = రీతి, మనసులో = మనస్సులోన అరసి = ఆలోచించి

క. బంధువులతోడఁ గూడి
నందఱు నొకపంక్తి యుండె ♦ యతిథులతోడన్
విందారగించువేళన్
ముందుగ భుజియించి లేచి ♦ పోకుము సుగుణా! ౨౮

అతిథులు = (మార్గాయాసమున) భోజనమునకు వచ్చినవారు.

క. దూషించినవారలపై
దోషం బెన్నగరాదు; దొర వని నినున్
భూషించిన నుప్పొంగకు;
దూషణభూషణము లెపుడుఁ ♦ దుల్యము సుగుణా! ౨౯

దూషించిన = తూలనాడిన, దోషము = నేరము, దొర = ప్రభువు. భూషించిన = పొగడిన, తుల్యము = సమము,

క. ఎదురాడుచున్న శిష్యుని
నెదురాడుచునున్న సఖుని ♦ నెల్లప్పుడు నీ
కెదురాడుచున్న సేవకు
నెదఁ గొంకక విడవలయు ♦ నిలలో సుగుణా! ౩౦

ఎదురాడుచున్న = (తిరస్కారభావముతో) తిరిగి చెప్పుచున్న సఖుని = స్నేహితుని. సేవకుడు = పరిచర్యజేయువాడు. కొంకక = సందేహింపక, ఇల = భూమి

క. నయ మేమిలేనిమంగాను
ప్రియమున నిడనట్టివిందు ♦ బిగియనిబందున్
లయఁ దెలియనట్టిచిందును
పయనం బగునపుడు కుందు ♦ వలదుర సుగుణా! ౨౮

ప్రియమునన్ = ఇష్టముతో, ఉంచనట్టి = ఉంచని (పెట్టని) విందు = భోజనము, లయ = తాళముయొక్క కాలము; చిందు = నాట్యము, పయనము = ప్రయాణము, కుందు = విచారము.

క. ఎప్పుడు నమ్మకు కుజనుల
జెప్పెడిమాటలను; హితముఁ ♦ జెప్పగ; దానన్
ముప్పగు; నపుడు సహాయము,
చెప్పినవా రెవరు నీకు ♦ చేయరు సుగుణా! ౨౯

కుజనులు = చెడ్డవారు, హితము = మంచి, ముప్పు = మోసము.

క. గర్వము శత్రులఁ గూర్చును;
గర్వ మగౌరవము దెచ్చుఁ; ♦ గావున నెపుడున్
గర్వింపకు ధనమున్నను;
సర్వము చెడు గర్వమున్న ♦ సత్యము సుగుణా! ౩౦

శత్రులు = పగవారు, సత్యము = నిజము.

క. నమ్మఁగవలెఁ దల్లిదండ్రుల;
నమ్మఁగవలె స్నేహితులను; ♦ న్యాయాధిపతిన్
నమ్మఁగవలెఁ; గార్యమ్ములు
నమ్మిక లేకున్నఁ జెడును; ♦ నగుదువు సుగుణా! ౩౧

న్యాయాధిపతి = న్యాయము అన్యాయము చెప్పుటలో నేర్పరి, కార్యములు = పనులు, నగుదురు = నవ్వుదురు.

—: ధ న ము :—

క. జనులు చెడుపనులు సేయుచు
ధన మార్జించుదురు; గాని ♦ దలఁపరు ఘనతన్
గనుకను బాగోగులఁ గని
ధనమార్జింపంగవలయుఁ ♦ దప్పక సుగుణా! 3౨

ఆర్జించుదురు = సంపాదించుదురు, ఘనతన్ = గొప్పతనమును, బాగోగులు = మంచిచెడ్డలు.

క. వినుమన్నకు దమ్మునకున్,
జననికి సుతులకును, మఱియు ♦ సతికిన్ పతికిన్
జనకునకును దనయులకును
ధనమే పగ గూర్చునయ్య ♦ తథ్యము సుగుణా! 33

జనని=తల్లి, సుతులు=కుమారులు, సతికిన్= భార్యకును(స్త్రీ); పతికిన్ = మగనికిని, జనకునకున్ = తండ్రికిని, తనయులకున్ = కొడుకులకును, పగ = వైరము; తథ్యము = యథార్థము.

క. ధనమును గాచుటకై ని
ద్రను మాని శరీరమునకుఁ ♦ దప్పక రోగం
బును దెచ్చుకొందు రీజగ
మునఁ గొందఱు లోభిజనులు ♦ మూఢులు సుగుణా! 3౪

మూఢులు = తెలివితక్కువవారు, లోభిజనులు = ఉండి ఖర్చు పెట్టనివారు.

## —: దా న ము :—

క. మొలనూలైనను బ్రాఁణము
దొలఁగినచో వెంటరాదు ♦ దొరలకు నైనన్
కలిమిఁగలనాఁడె దానము
వలనొప్పఁగఁ జేసికీర్తి ♦ వడయుము సుగుణా! ౩౭

మొలనూలు = మొలకు కట్టుకొను త్రాడు; దొరలకు = మహా రాజులకు, కలిమి = సంపద, పడయుము = పొందుము.

క. కలిగినవానికి దానము
పలుతెఱఁగుల జేయ నేల? ♦ వ్యర్థము కాదే?
జలనిధికి నీరు లోటా?
జలదం బందెంత కురియ ♦ సఫలమొ? సుగుణా! ౩౮

కలిగినవానికి = ధనవంతునికి, దానము = ఈవి (ఇచ్చుట) పలు తెఱఁగుల = అనేకవిధములుగా వ్యర్థము = వృథ, జలనిధి = సముద్రము, లోటా? = తక్కువా?, జలదము = మేఘము, అందు = అచ్చట; (అనగా సముద్రమున) సఫలమొ? = ప్రయోజనమా?

క. కర్మఫల మొందఁ దప్పదు;
మర్మము విడనాడి పేద ♦ మనుజుల కెల్లన్
ధర్మము సేయుము వేగమె;
"ధర్మము గాచు"నన్న మాట ♦ దలఁపుము సుగుణా! ౩౯

కర్మఫలము=తనచేష్టలవలన గలిగినఫలితము, మర్మము=కపటము.

క. తా నియ్యక యొకరిచ్చెడి
దానిని వలదనుచు నడ్డు ♦ దగుటుట మేలా?

కానను బోదెలు ఫలించిన
మ్రానుని కడ్డముగ నిలుచు ♦ మాదిరి సుగుణా ౩౮

మ్రాను = చెట్టు, మాదిరి = రీతి.

క. ఇయ్యకు మని బోధించిన
నియ్యఁడు హీనుండు; దాత ♦ యిచ్చియెతీరున్
నుయ్యడ్డబడును తెలుపున
పయ్యరచే మేఘ మడ్డఁ ♦ బడునా? సుగుణా! ౩౯

హీనుఁడు = నీచుఁడు. దాత = ఔదార్యము గలవాఁడు; నుయ్యి + అడ్డబడును = నూయి ఆటంకపరుపబడును. తెలుపున = తెలుపువలన, పయ్యెరచే = దక్షిణమునుండి వీచు గాలిచే.

క. ధన మార్జించెడు వేళన్
దన కది శాశ్వత మటంచుఁ ♦ దలఁప న్వలయున్;
గనవలె సర్వ మశాశ్వత
మని దానము సేయునప్పు ♦ డనిశము సుగుణా! ౪౦

ఆర్జన = సంపాదన, శాశ్వతము = ఎల్లకాలమునుండునది, అనిశము = ఎల్లప్పుడు.

క. వ్రాయఁగవలె సద్గ్రంథం;
బీయఁగవలె నున్నదాని ♦ నెవ్వారికైనన్;
జేయఁగవలె దానము; నెడఁ
బాయఁగవలె దుష్టు నెపుడు ♦ వసుధను సుగుణా! ౪౧

ఎడబాయఁగవలెను = విడిచిపెట్టవలెను, దుష్టుని = దుర్మార్గుని, వసుధన్ = భూమియందు.

క. ఇయ్యఁదలంచినమనుజుం
డియ్యకమానఁడు జగాన ♦ నియ్యనిలోభిన్,
వెయ్యాఋసాసు లడిగిన
నియ్యఁడు; నీమాట దక్క ♦ నీయదు సుగుణా! ౪౨

జగానన్ = ప్రపంచమందు, వెయ్యాఋసాసులు = అనేకమారులు.

—: ఋణము :—

క. కలవానిరీతి నుండుట
కిలు నమ్మి ఋణమ్ముఁ జేసి ♦ యేలా? వగవన్;
కలిగినఁ బాలను ద్రాగుము;
కలుగనిచో గంజి త్రాగి ♦ గడుపుము సుగుణా! ౪౩

కలవానిరీతి = ధనవంతునివలె, వగవన్ = విచారించుట.

క. పదివేలు వచ్చుచుండినఁ
బదిలక్షలు ఖర్చు సేయు ♦ వానికి ఋణమే
గుదివలె మెడకుం దగులును
మదిఁ జివుకుచుఁ గడ కతండు ♦ మడియును సుగుణా! ౪౪

మది = మనస్సు, చివుకుచు = పటుత్వము తగ్గుచు, మడియును = చనిపోవును.

క. ఋణదాత యొప్పియున్నను
గుణశాలివె యైన ధనము ♦ గూరిచి వడి నీ

ఋణమెల్లఁ దీర్పు; మగ్ని
వ్రణఋణరిపు శేష ముంచ రాదుర సుగుణా! ౪౫

ఋణదాత = అప్పునిచ్చినవాఁడు, అగ్ని = నిప్పు వ్రణము = కురుపు, రిపులు = శత్రువులు, శేషము = మిగులుట.

క. అప్రియుకు చెడువానికిఁ
జిప్పయె చేతికిని వచ్చుఁ; జిట్టెం దవుదుర్
జొప్పయు గొడ్డావున కిడ
నెప్పటి కెందైన లాభ మేమగు? సుగుణా! ౪౬

ఇడుట = ఇచ్చుట, (పెట్టుట).

—: స త్య ము :—

క. మాటాడఁ దలఁచినప్పుడు
మాటికి మదిలోన నరసి మాటాడవలెన్;
నోటను బలికినమాటను
కోటి యొసంగినను దప్పఁ గూడదు సుగుణా! ౪౭

మదిలోనన్ = మనస్సునందు, అరసి = ఆలోచించి.

క. మాటను ముందుగ నిచ్చిన
నోటనె లేదన్నవాని నోరొకనోరా?
తూటుపడినట్టికుండ నన
లోటగునే? నవ్వరొక్కొ? లోకులు; సుగుణా! ౪౮

తూటుపడిన = చిల్లుపడిన లోటు = తప్పు.

—: సా క్ష్య ము :—

క. ఎఱుఁగనిసంగతులను నీ
వెఱిఁగినగతి దొంగసాక్ష్య మీయకు; దానన్
గొఱవడు న్యాయము; కావునఁ
గుఱుతుగఁ దగుసాక్ష్య మీయ గొనబగు సుగుణా! ౪౯

కొఱవడుఁ = తక్కువగును, గొనబు = రమ్యము.

—: ఐ క మ త్య ము :—

క. అన్నలతో ద్వేషము నీ
కెన్నఁడుఁ దగదయ్య; వార లెవ్వరో మనమం
దెన్నుము; మున్నన్నల నొగిఁ
గన్నదియే నిన్నుఁగూడఁ గన్నది సుగుణా! ౫౦

ద్వేషము = వైరము.

క. అనుజులతోఁ గలహించుట
యనుకూలము గాదు; పెద్ద లందఱు నగి ఛీ
యని దూషింతురు గావున
జనులకు నైక్యమ్ము మేలు సతతము సుగుణా! ౫౧

అనుజులతోఁ = తమ్ములతో, ఐక్యము = కలసి మెలసియుండు
టు; సతతము = ఎల్లప్పుడు.

—: గు ణ శా లి :—

క. పెద్దలఁ గని గుణములు గుణి
దిద్దుకొనుఁ; జెనఁటి యెపుడు దిద్దుకొనఁగలేఁ;

డద్దము గని నయనుఁడె సిగఁ
దిద్దుకొనున్; గ్రుడ్డి తరమ? దిద్దుట, సుగుణా! ౨౨

గుణి = గుణములుకలవాఁడు (గుణవంతుఁడు) చెనటి = తుచ్ఛస్వభావముగలవాఁడు, నయనుఁడె = కన్నులుగలవాడె; సిగ = తలవెండ్రుకల ముడి.

క. గుణహీనుని గుణి యని యన
గుణివలె వర్తించి యతఁడె గుణి యగుఁ జుమ్మీ;
గుణి నే నని గుణి యన
గుణుఁడే యాఁగాక వాఁడు గుణియా? సుగుణా! ౨౩

గుణహీనుని = తక్కువగుణములు గలవానిని (నీచుని); గుణి = గుణవంతుఁడు, వర్తించి = నడచుకొని అవగుణుఁడు = చెడ్డగుణములు గలవాఁడు.

క. ఒకటి దలంచి కుబుద్ధి, మ
ఱొకటి యనుం బైకిఁ; జేత యుర్ వేఱు; బుధుం
డొకటియె తలఁచినఁ, జెప్పిన
నొకటియె, చేసినను దప్ప కొకటిగా సుగుణా! ౨౪

కుబుద్ధి = దుర్బుద్ధిగలవాఁడు, బుధుడు = మంచిచెడ్డలు తెలిసినవాఁడు, పండితుఁడు.

క. చెనఁటి యొకకీడొనర్చిన
గుణవంతుఁడు తిరిగి కీడు గూర్చుట మేలా?
శునకము పాదముఁ గఱచినఁ
గసలుచు శునకమును దిరిగి కఱతురె? సుగుణా! ౨౫

చెనఁటి = తుచ్ఛస్వభావముగలవాఁడు, కీడు = చెడుగు, కువకము = కుక్క, కనలుచున్ = కోపగించుచు.

క. కూరిమితో గుణవంతుని
జేరిన యల్పుండు ఘనతఁ జెందును; పూలన్
జేరక దా? శిర మెక్కును
దారము; లేకున్న దాని తరమా? సుగుణా! ౫౬

కూరిమి = మక్కువ, అల్పుఁడు = తుచ్ఛుఁడు, ఘనత = గొప్పతనము, శిరము = తల.

—: శా ం త ము :—

క. పంతముఁ జెల్లించెదనం
చెంతో కోపింతు; వెవ్వ రేమనినను నీ
వెంతయు శాంతము బూనుము
"శాంతమెభూషణము" సుమ్ము సత్యము సుగుణా! ౫౭

భూషణము = నగ, సత్యము = నిజము.

—: వి న య ము :—

క, ధనవంతుఁడ నా కేమని
యనుకొని యుప్పొంగి గర్వ మందకు మెపుడున్
ధనమున్న నేమిలాభము?
వినయము లేకున్నఁ గీర్తి వెలయునె? సుగుణా! ౫౮

వినయము = అణకువ; వెలయునె? = ఒప్పునె?.

## —: విద్య :—

క. మిద్దెలు లేనిగృహమ్మును
పద్దులు వ్రాయక యొసంగు బదులును వసుధన్
పెద్దలు లేనిపురమ్మును
విద్దియ లేనట్టికులము వ్యర్థరా సుగుణా! ౫౯

గృహము = ఇల్లు; పురము = ఊరు; విద్దియ = విద్య; వ్యర్థ= వ్యర్థము.

క. పెద్దనఁ బొడు గను కొనకుము;
పెద్దస నయ సెచ్చుకాదు; పెంపుగ బుద్ధిన్
విద్దెయుఁ గల్గినవానిని
పెద్దని చెప్పఁగవలయుఁ బృథ్విని సుగుణా! ౬౦

వయసు = ఈడు; పృథ్వి = భూమి.

క. అద్దపు మేడైనను గన
రద్దమరాతిరిని దివ్వె యమరక యటులే
బుద్ధిగలవానినైనను
విద్దియ లేకున్నఁ గనరు విశదము సుగుణా! ౬౧

అద్దమ రాతిరి = అర్ధరాత్రి; దివ్వె = దీపము; కనరు = చూడరు; విశదము = స్పష్టము.

విద్యయె తెలుగని జీతము;
విద్యయె మిత్రమ్మనుమ్ము; విద్యయె సొగసున్;

విద్యయె మూడవనేత్రము;
విద్యయె తా దాఁచుకొన్న విత్తము సుగుణా! ౬౨

విత్తము = ధనము, నేత్రము = కన్ను.

క. విద్యయె కీర్తిని దెచ్చును;
విద్యయె సభ వశముసేయు; విద్యయె నగయా;
విద్యయె సంపద లిచ్చును;
విద్యారహితుండు పశువె విశదము సుగుణా! ౬౩

విద్యారహితుఁడు = చదువులేనివాఁడు. విశదము = స్పష్టము.

క. రూపవిహీనుని కెప్పుడు
లోపము గనరాదు చదువు లోపము లేమిన్;
రూపం బున్నను విద్యా
లోపము సర్వమ్ము సేయు లోపము సుగుణా! ౬౪

రూపవిహీనునికి = సొగసులేనివానికి.

తనపురినే ధనశాలియు
తనరాష్ట్రమునందె భూమి ధవుఁడును సతమున్
ఘనతవహింతురు; పండితుఁ
డనయం బెల్లెడల ఘనత నందును; సుగుణా! ౬౫

పురి = గ్రామము, రాష్ట్రము = రాజ్యము, వహింతురు = పొందుదురు, అనయము = ఎల్లపుడు, ఎల్లెడలన్ = అన్నిచోటులందు, ఘనత = గొప్పదనము.

## —: వి ద్య :—

క. మిద్దెలు లేనిగృహమ్మును
పద్దులు వ్రాయక యొసంగు ॥ బదులును వసుధన్
బెద్దలు లేనిపురమ్మును
విద్దియ లేనట్టికులము ॥ వృధరా సుగుణా! ౫౯

గృహము = ఇల్లు; పురము = ఊరు; విద్దియ = విద్య; వృధ = వ్యర్థము.

క. పెద్దనఁ బొడు గనుకొనకుము;
పెద్దన వయ సెచ్చుకాదు; ॥ పెంపుగ బుద్ధిన్
విద్దెయుఁ గల్గినవానిని
బెద్దని చెప్పఁగవలయుఁ ॥ బృథ్విని సుగుణా! ౬౦

వయసు = ఈడు; పృథ్వి = భూమి.

క. అద్దపు మేడైనను గన
రద్దమరాతిరిని దివ్వె ॥ యమరక యటులే
బుద్ధిగలవానినైనను
విద్దియ లేకున్నఁ గనరు ॥ విశదము సుగుణా!

అద్దమరాతిరి = అర్ధరాత్రి; దివ్వె = దీపము; కనరు = చూడరు; విశదము = స్పష్టము.

క. విద్యయె తఱుగని జీతము;
విద్యయె మిత్రమ్మసుమ్మీ; ॥ విద్యయె సొగసుల్;

విద్యయె మూఁడవ నేత్రము;
విద్యయె తాఁ దాఁచుకొన్న విత్తము సుగుణా! ౬౨

విత్తము = ధనము, నేత్రము = కన్ను.

క. విద్యయె కీర్తిని దెచ్చును;
విద్యయె సభ వశము సేయు; విద్యయె నగయా;
విద్యయె సంపద లిచ్చును;
విద్యారహితుండు పశువె విశదము సుగుణా! ౬౩

విద్యారహితుఁడు = చదువులేనివాఁడు, విశదము = స్పష్టము.

క. రూపవిహీనుని కెప్పుడు
లోపము గనరాదు చదువు లోపము లేమిన్;
రూపం బున్నను విద్యా
లోపము సర్వమ్ము సేయు లోపము సుగుణా! ౬౪

రూపవిహీనునికి = సొగసులేనివానికి.

క. తనపురినే ధనశాలియు
తనరాష్ట్రమునందె భూమిధవుఁడును సతమున్
ఘనత వహింతురు; పండితుఁ
డనయం బెల్లెడల ఘనత నందును; సుగుణా! ౬౫

పురి = గ్రామము, రాష్ట్రము = రాజ్యము, వహింతురు = పొందుదురు, అనయము = ఎల్లపుడు, ఎల్లెడలన్ = అన్నిచోటులందు, ఘనత = గొప్పదనము.

## —: రా జు :—

క. జనులను దనపిల్లలవలెఁ
గని సర్వసుఖమ్ము లొసఁగి । కాపాడెడు నా
మనుజేశుని బోషిచుటకై
ఘనముగ దైవమును గొల్వఁ । గాఁ దగు సుగుణా! ౬౬

కని = చూచి, ఒసఁగి = ఇచ్చి, మనుజేశుని = రాజుని.

క. జనులెల్లరు నాపిల్లలు;
జనులన్ దయతోడఁ జూచి । సౌఖ్యము లెల్లన్
ఘనముగ గూర్చుట నాపని
యని యేలెడురాజు మాన్యుఁ । డనఁదగు సుగుణా! ౬౭

మాన్యుఁడు = పొగడదగినవాఁడు.

క. జననాయకుండు జనులకుఁ
గనిపించెడు దైవ; మతఁడు । కారుణ్యముతో
జనులను బ్రోచును; గావున
జననాయకుఁ గొల్వవలయు । సతతము సుగుణా! ౬౮

జననాయకుండు = రాజు, కారుణ్యము = దయ, ప్రోచును = కాపాడును, సతతము = ఎల్లప్పుడు.

## —:వివిధనీతులు:—

క. వల్లే యన రేటుచ్చిన
నల్లురు యాచకులుఁ బిల్ల । లతివలు ధరణీ

వల్లభుఁడు; కలిమి లేములు
నుల్లమున రవంత తలఁప నోపను సుగుణా! ౬౯

వల్లెయనను = చాలుననను, అల్లుగ = అల్లుండగుటచే, యాచకులు = బిచ్చమెత్తువారు, అతివలు = స్త్రీలు, ధరణీ వల్లభులు = రాజులు, కలిమి = సిరి, లేమి = లేకపోవుట (దరిద్రము, ఉల్లము = మనస్సు, రవంత = కొంచెమైనను.

క. కవనముఁ జెప్పని నోరును
చవియేమియు లేని చేరు జరుగనియూరున్
భువిఁ బారనట్టియేరును
పవడము లేనట్టిపేరు వ్యర్థము; సుగుణా! ౭౦

కవనము = కవిత్వము, చవి = రుచి, చేరు = చారు (కాచిపోవుపు వేసిన చింతపండు రసము) జరుగని = కాలముగడువని, పవడము = పగడము, పేరు = మెడలో ధరించు దండ, వ్యర్థము = వృథ.

క. చుక్కాని లేనిపడవయు
రిక్కలదొర మింటలేని రేయియుఁ దండ్రిన్
లెక్కింపని పుత్రుండును;
వక్కలు లేనట్టివిడెము వ్యర్థము సుగుణా! ౭౧

చుక్కాని = ఓడను త్రిప్పు నుపకరణము రిక్కలదొర = చంద్రుఁడు, రేయి = రాత్రి, మింటన్ = ఆకాశమునందు, వక్కలు = పోకచెక్కలు, విడెము = తాంబూలము.

క. పతగములయందుఁ గాకము,
సతులందునఁ గులట, ఖరము జంతువులందున్,

పతితుఁడు మనుజులయందుక్,
యతులందుం గోపి, నీచ కాదుసు; సుగుణా! ౨౨

పతగము = పక్షి, కాకము = కాకి, సతులు = స్త్రీలు, కుల
ట = జారస్త్రీ; ఖరము = గాడిద, పతితుఁడు = పాపము జేసినవాఁ
డు; యతి = ముని.

క. ఆడకు మెప్పుడు జూదం;
బాడినఁ దమకమున నష్టమందుదువు చుమీ;
యాడి నలధర్మజులు ము
న్నాడి వనంబులను జిక్కులొందరె? సుగుణా! ౨౩

వనములక్ = అడవులందు.

క. ఎంత తన కిచ్చుచున్నను
సంతుష్టిని బొందనట్టి జగతీసురుఁ డుక్;
సంతుష్టిని బొందెడుభూ
కాంతుండును, జెడుదు రీజగమ్మున సుగుణా! ౨౪

జగతీసురుఁడు = బ్రాహ్మణుఁడు; భూకాంతుఁడు = రాజు;
జగము = ప్రపంచము.

క. పరిచయము గౌరవంబును
తరిగించును గౌరవంబు తగ్గకయుండక్
బరిచయము లేని తావుల
నరయగనతి పరిచయంబె బనర్థము సుగుణా! ౨౫

పరిచయము = స్నేహముతో గూడిన విశ్వాసము, అనర్థము = న
ష్టదాయకము.

క. తన కేమియు లేనప్పుడు
తన కున్నటుల న్నటింపఁ దగ; దొకవేళన్
దనవేషము దెలిసినఁ గని
జను లాతని బరిహాసింతురు సత్యము సుగుణా! ౭౬

పరిహాసింతురు = వేళాకోళము లాడుదురు.

క. ఉన్నది లేదన నేలా?
ఉన్నను లేకున్న నితరు లొసఁగరు సుమ్మా;
ఉన్నదని లేమిఁ జెప్పక
ఉన్నది యున్నట్లు చెప్ప నుచితము సుగుణా! ౭౭

ఒసఁగరు = ఇయ్యరు; లేమిన్ = లేనప్పుడు (దరిద్రమున)
ఉచితము = తగినది.

క. కష్టదశలోన మూర్ఖుఁడు
సృష్టించినవాని మిగులఁ జెడు గని దూఱున్
కష్టదశ వచ్చుటకుఁ దన
చేష్టలెపో కారణమ్ము సిద్ధము సుగుణా! ౭౮

మూర్ఖుడు = తెలివితక్కువవాఁడు; సృష్టించినవానిని = పుట్టించినవానిని (బ్రహ్మను) చెడుగు = దుర్మార్గుఁడు; దూఱున్ = తూలనాడును.

క. తనకున్ దైవ మొసంగిన
ధనమే మేలంచు నెంచి తా నెల్లపుడున్
దనివిని బొందుచు నుండెడి
మనుజుఁడెపో జగతిలోన మాన్యుఁడు సుగుణా! ౭౯

తనివి = తృప్తి, మాన్యుఁడు = పొగడదగినవాడు.

క. మెత్తనివానిని జూచిన
మొత్తుదు రది నిజమె; బలియు । ముట్టరు; ధరణిన్
మెత్తనికుండను కుమ్మరి
మొత్తును; కాలినఘటమ్ము । ముట్టఁడు; సుగుణా ౮౦

మెత్తనివానిని = అమాయకుని; బలియుఁన్ = బలవంతుని; ఘటమ్ము = కుండ.

క. ధరిపతికి వచ్చునాపద
ధరపతియే దీర్చు; పేద । తరమా? బురదన్
కరి దిగఁబడినను కరియే
దరిఁజేర్చును సూకరమ్ము । తరమా? సుగుణా! ౮౧

ధరపతి = రాజు; కరి = ఏనుఁగు; దరి = ఒడ్డు, సూకరమ్ము = పంది.

క. మొగ మందముగా నున్నను
నగ లెన్నో బెట్టుకొన్న । నారుల కైనన్
మగవారల కైనను విను
మొగమున కారయఁగ బొట్టు । ముఖ్యము సుగుణా! ౮౨

నారుల కైనన్ = స్త్రీల కైనను; ఆరయంగన్ = ఆలోచించగా.

క. కవనము జెప్పుదు రందఱుఁ;
గవనము రసపుష్టికలది । కావలె; శాకం
బెవ రైన వండ నేర్తురు
పోపులు దగ నంట నదియ । పొలుపగు సుగుణా! ౮౩

కవనము = కవిత్వము; శాక = కూర; పోపులు = జీలకఱ్ఱ మెంతులు మొదలైన సంబారముల సంస్కారము; పొలుపు = ఒప్పు.

క. నిందితుఁ డొకఁ డుండిన సభ
యందఱి కపకీర్తి గల్గు నది యెట్లన్నన్
మందను దొంగావుండిన
మందంతకు బందె గల్గు మాదిరి సుగుణా! ౮౮

నిందితుఁడు = అపవాదములాడఁబడుటకు తగినవాఁడు; అపకీర్తి = చెడ్డపేరు.

క. మేలొనరించితి వని దు
ర్శీలురు దలఁపకయె నిన్నుఁ జెఱుతురు; పాముల్
పాలిడి పెంచినవాని నె
యాలోచన మాని కఱచు నట్టుల సుగుణా! ౮౯

మేలు = ఉపకారము; ఒనరించితివి = చేసితివి; దుశ్శీలురు = చెడ్డస్వభావముగలవారు.

క. ఇవురున సుధ పికములకున్,
రవియెడ సుధ జక్కవలకు, రాజుల కెల్లన్
బవరమునందున సుధ, స
త్కవులకు సుధ వాక్కులందు కలుగును సుగుణా! ౯౦

ఇవురు = చిగురు; సుధ = అమృతము (మాధుర్యము) పికము = కోకిలపిట్ట; రవి = సూర్యుఁడు; జక్కవలకు = చక్రవాకపక్షులకు బవరము = యుద్ధము; సత్కవులకు = సారస్యముగల కవిత్వము చెప్పువారికి; వాక్కులు = పలుకులు.

క. మనుజుల ప్రాణము హెచ్చని
యనుకొనకుము; ప్రాణ మొకటె యన్నిటి కవనిన్;
మును చేసిన కర్మఫల
మ్మున భేదము గల్గు, గూపమున విను సుగుణా! ౮౭

అవనిన్ = భూమియందు.

క. కొలుతురు 'గాడ్డ'ని కొందఱు
కొలుచుదు 'రల్లా' యటంచు కొందఱు మనుజుల్;
కొలుతురు క్రీస్తని కొందఱు
కొలుతురు రామా యటంచు కొందఱు సుగుణా! ౮౮

గాడ్డ్ = (ఆంగ్లపదము) దేవుడు; అల్లా = ఇది మహమ్మదీయులు దేవుని పిలుచు పదము.

క. పెక్కండ్రు పెక్కువిధములఁ
జక్కని నామమ్ము లుంచి సతతము భక్తిన్
మొక్కుదురు; కాని యందఱి
కొక్కఁడెపో దేవుఁ; డాత్మ యొకటే; సుగుణా! ౮౯

పెక్కండ్రు = చాలామంది, నామము = పేరు; భక్తిన్ = భక్తితో; మొక్కుదురు = నమస్కరింతురు,

క. ఏరీతిగఁ బుట్టెదరో
యారీతిగఁ బోవుచుందు; రవనిం గలవా
ర్వారల కైనను వెంటన్
గూరా కేనియును రాదు కోరిన సుగుణా! ౯౦

ఎవ్వారలకైనను = ఎవరికైనను.

క. గాలము వేసియె మనకై
కాలుఁడు కాచుకొనియుండుఁ గావున మన మె
క్కాలమునం దైనను యము
గాలమ్మునఁ జిక్కవలయుఁ గదరా సుగుణా! ౯౧

కాలుఁడు = యముఁడు; ఎక్కాలము = ఏకాలము.

క. కాలికి నేలికి మందులు
కాలము తనకున్నయపుడె కడ కతనికిఁ బో
గాలము వచ్చిన హరిగుణ
జాలస్మరణమ్మె మందు సత్యము సుగుణా! ౯౨

పోగాలము = చనిపోవుకాలము; హరి = విష్ణుమూర్తి యొక్క,
గుణజాల = గుణముల సమూహమును; స్మరణమ్మె = తలచుకొనుటయె;
మందు = ఔషధము.

క. చదివిన భాగవతమ్మే
చదువఁగవలె; జగతిలోన జదువనిమనుజుల్
పదయుగము గల్గుపశువులు
మదిలోనన్ సందియమ్ము మానుము సుగుణా! ౯౩

భాగవతము = భగవంతునిచరిత్ర; పదయుగము = రెండుపాద
ములు; మది = మనస్సు; సందియము = సందేహము.

క. మోహమ్మును విడనాడుచు
దేహము గలనాఁడె నీల దేహుని రామున్

జోహారొనర్చి గొలిచిన
నోహో యని నీకు ముక్తి నొసఁగును సుగుణా! ౭౮

మోహము = వలపు; విడనాడుచు = వదలిపెట్టుచు; దేహము = శరీరము; జోహారు = నమస్కారము; ముక్తి = మోక్షము; ఒసగును = ఇచ్చును.

క. నోరున్న దనుచుఁ బరులను
గేరుటయా? పాప మాను కేరకు మెపుడున్;
నోరున్న ఫలము భక్తిన్
శ్రీరాము నినామ ముచ్చరించుట సుగుణా! ౭౯

పరులను = ఇతరులను; కేరుట = పరిహసించుట; ఉచ్చరించుట = పలుకుట.

క. కరములు గలఫల మెయ్యది?
మురుగులు ధరియించి చూచి మురియుటయా? శ్రీ
కరివరదునిపదములు గని
కర మొప్పఁగఁ బూజ సేయఁ గలుగుట సుగుణా! ౭౩

కరములు = చేతులు; ఫలము = ఫలితము; ఎయ్యది = ఏది; శ్రీకరివరదుని = విష్ణుమూర్తియొక్క. పదములు = పాదములు, కర ము = మిక్కిలి.

క. తినవలె దైవప్రసాదము;
వినవలెఁ జెవులార నపుడు విష్ణుచరిత్రల్;
చనవలె దేవళమునకున్;
గనవలె బ్రహ్మంబు; ముక్తి గనవలె సుగుణా! ౭౨

దైవప్రసాదము = దేవునికి నైవేద్యము చేసినవస్తువులు, విష్ణుచరిత్రలు = విష్ణుమూర్తికథలు, చనవలెను = వెళ్ళవలెను, దేవళము = దేవుని గుడి; బ్రహ్మంబు = పరబ్రహ్మము (తత్వము) ముక్తి = మోక్షము; కనవలెను = పొందవలెను.

క. నరులకు సిరి సంపద లిడి
దురితమ్ముల నెల్లఁ బాఱఁ ద్రోలుచు క్షేమం
బరసెడు రఘురామునిపద
సరసిజములపూజ యెపుడు సలుపుము సుగుణా! ౯౮

నరులకు = మనుష్యులకు, సిరి = ధనము; సంపద = కుటుంబవృద్ధి. ఇడి = ఇచ్చి; దురితమ్ములన్ = పాపమ్ములను, పారద్రోలుచున్ = పోగొట్టుచు; క్షేమము = కుశలము; అరసెడు = కనుగొనెడు; రఘురాముని = రఘువంశమున పుట్టిన శ్రీరాముని; సరసిజము = తామర పద్మము; సలుపుము = చేయుము.

క. జనకుం డాజ్ఞాపించిన
పనిఁ దనయుఁడు చేసితీరవలెనను నీతిన్
జనులకుఁ గఱపిన దశరథ
తనయుఁడా కృతి నందెదీని దయతో సుగుణా! ౯౯

జనకుండు = తండ్రి. ఆజ్ఞాపించిన = ఉత్తరువుచేసిన, తనయుడు = కుమారుఁడు, కఱపిన = నేర్పిన.

క. శ్రీరామమూర్తి యనునత
డారయఁ బట్టిసపువంశమందునఁ గల సు
బ్బారాయ లక్ష్మమాంబల
కూరిమికొమరుండు; విప్రకులజుఁడు; సుగుణా! ౧౦౦

కూరిమి = మక్కువ, విప్రకులజాుడు = బ్రాహ్మణవంశమున పుట్టి నవాడు.

క. ధారుణి కుత్ససగోత్రుఁడు,
శ్రీరామధ్యాననిరత శీలురసుతుఁడౌ
శ్రీరామమూర్తి దీనిని
శ్రీరామార్పణము జేసె స్థిరమతిఁ సుగుణా! ౧౦౧

ధారుణిన్ = భూమియందు, శ్రీరామ = శ్రీరాముని, ధ్యాన = మనస్సునిల్పి చింతచేయుటయందు; నిరతశీలుర = ఎల్లప్పుడుస్వభావము గలవారియొక్క; సుతుఁడౌ = కుమారుఁడగు, అర్పణము = అప్పగి త స్థిరమతిన్ = చలించనిమనస్సుతో.

సంపూర్ణము.



రెడ్డీముద్రాక్షరశాల, రామచంద్రపురం.

